అథ తృతీయో%**ధ్యాయః**

## ఓంకార స్వరూపము - సన్న్యాస పద్ధతి

ఈశ్వర ఉవాచ|

శృణు దేవి ప్రవక్ష్యామి యన్మాం త్వం పరిపృచ్ఛసి | తస్య శ్రవణమాత్రేణ జీవస్సాక్షాచ్ఛివో భ##వేత్ || 1

ప్రణవార్థపరిజ్ఞానమేవ జ్ఞానం మదాత్మకమ్ | బీజం తత్సర్వవిద్యానాం మంత్రం ప్రణవనామకమ్ || 2

అతిసూక్ష్మం మహార్థం చ జ్ఞేయం తద్వటబీజవత్ | వేదాది వేదసారం చ మద్రూపం చ విశేషతః || 3

దేవో గుణత్రయాతీతస్సర్వజ్ఞస్సర్వకృత్ప్రభుః | ఓమిత్యేకాక్షరే మంత్రే స్థితో%హం సర్వగశ్శివః || 4

యదస్తి వస్తు తత్సర్వం గుణప్రాధాన్యయోగతః | సమస్తం వ్యస్తమపి చ ప్రణవార్థం ప్రచక్షతే || 5

సర్వార్థసాధకం తస్మాదేకం బ్రహ్మైతదక్షరమ్ | తేనోమితి జగత్కృత్స్నం కురుతే ప్రథమం శివః || 6

శివో వా ప్రణవో హ్యేష ప్రణవో వా శివః స్మృతః | వాచ్యవాచకయోర్భేదో నాత్యంతం విద్యతే యతః || 7

తస్మాదేకాక్షరం దేవం మాం చ బ్రహ్మర్షయో విదుః | వాచ్యవాచకయోరైక్యం మన్యమానా విపశ్చితః || 8

అతస్తదేవ జానీయాత్ప్ర ణవం సర్వకారణమ్ | నిర్వికారీ ముముక్షుర్మాం నిర్గుణం పరమేశ్వరమ్ || 9

ఏనమేవ హి దేవేశి శర్వమంత్రశిరోమణిమ్ | కాశ్యామహం ప్రదాస్యామి జీవానాం ముక్తి హేతవే || 10

ఈశ్వరుడు ఇట్లు పలికెను -

ఓ దేవీ! వినుము. నీవు నన్ను ప్రశ్నించిన విషయమును చెప్పగలను. దీనిని విన్నంత మాత్రాన జీవుడు సాక్షాత్తుగా శివుడు అగును (1). ఓంకారముయొక్క అర్థమును తెలియుట యనగా నా స్వరూపమగు జ్ఞానమును పొందుటయే. ఓంకారము అనే మంత్రమునకు ప్రణవము అని పేరు. అది ఉపాసనలన్నింటికీ మూలము (2). అది మర్రిచెట్టు విత్తనము వలె మిక్కిలి సూక్ష్మమైనది మరియు గొప్ప అర్థము గలది. వేదమునకు కారణమైనది, వేదముల సారము అగు ఓంకారము విశేషించి నా స్వరూపమే యగుచున్నది (3). ప్రకాశస్వరూపుడను, సత్త్వరజస్తమోగుణములకు అతీతుడను, సర్వమునెరింగిన వాడను,సర్వమును సృష్టించిన వాడను, సర్వజగన్నాథుడను. సర్వవ్యాపకుడను, మంగళకరుడను అగు నేను ఓం అనే ఒకే అక్షరము గల మంత్రమునందు ప్రతిష్ఠితుడనై యున్నాను (4). సత్త్వరజస్తమోగుణముల కలయికలోని హెచ్చు తగ్గుల వలన ఈ జగత్తులోని సకలపదార్థములు నిర్మాణమై యున్నవి. ఈ సమస్తము, దానిలోని విభిన్నములగు అంశములతో సహా ఓంకారముయొక్క అర్థములో అంతర్గతమగునని మహర్షులు చెప్పుచున్నారు (5). కావున, ఈ అక్షరము సర్వజగత్తునకు అధిష్ఠానము, అవినాశియగు పరంబ్రహ్మమే యగుచున్నది. శివుడు సృష్ట్యాదియందు ఈ అక్షరముచే సకలజగత్తును సృష్టించును (6), శివుడే ఓంకారమనియు, ఓంకారమే శివుడనియు చెప్పబడినది. ఏలయనగా, వాచకమగు ఓంకారమునకు వాచ్యమగు శివునకు భేదము లేశ##మైననూ లేదు (7). కావున, ఓంకారస్వరూపుడనగు దేవునిగా నన్ను బ్రహ్మర్షులు తెలియుచున్నారు. విద్వాంసులు వాచకమగు ఓంకారమునకు వాచ్యమగు పరంబ్రహ్మతో ఐక్యమును భావన చేయుచున్నారు (8). కావున, ముముక్షువు మనస్సులో వికారములు లేనివాడై, సర్వజగత్కారణము, నిర్గుణుడను, పరమేశ్వరుడను అగు

నేను ఓంకారస్వరూపుడనని తెలియవలెను (9). దేవతలకు ప్రభ్వియగు ఓ దేవీ! కావుననే, నేను జీవులు ముక్తిని పొందుట కొరకై కాశీలో సర్వమంత్రములలో శ్రేష్ఠమైన ఈ ఓంకారమును మాత్రమే ఉపదేశించెదను (10).

తత్రాదౌ సంప్రవక్ష్యామి ప్రణవోద్ధారమంబికే | యస్య విజ్ఞానమాత్రేణ సిద్ధిశ్చ పరమా భ##వేత్ || 11

నివృత్తిముద్ధరేత్పూర్వమింధనం చ తతః పరమ్ | కాలం సముద్ధరేత్పశ్చాద్దండమీశ్వరమేవ చ || 12

వర్ణపంచకరూపో%యమేవం ప్రణవ ఉద్ధృతః | త్రిమాత్రబిందునాదాత్మా ముక్తిదో జపతాం సదా || 13

బ్రహ్మాదిస్థావరాంతానాం సర్వేషాం ప్రాణినాం ఖలు | ప్రాణః ప్రణవ ఏవాయం తస్మాత్ప్ర ణవ ఈరితః || 14

అద్యం వర్ణమకారం చ ఉకారముత్తరే తతః | మకారం మధ్యతశ్చైవ నాదాంతం తస్య చోమితి || 15

జలవద్వర్ణమాద్యంతు దక్షిణ    చోత్తరే తథా | మధ్యే మకారం శుచివదోంకారే మునిసత్తమ || 16

అకారశ్చాప్యుకారో%యం మకారశ్చ త్రయం క్రమాత్ | తిస్రో మాత్రాస్సమాఖ్యాతా అర్ధమాత్రా తతః పరమ్ || 17

అర్ధమాత్రా మహేశాని బిందునాదస్వరూపిణీ | వర్ణనీయా నవై చాద్ధా జ్ఞేయా జ్ఞానిభిరేవ సా || 18

ఈశానస్సర్వవిద్యానామిత్యాద్యాః శ్రుతయః ప్రియే | మత్త ఏవ భవంతీతి వేదాస్సత్యం వదంతి హి || 19

తస్మాద్వేదాదిరేవాహం ప్రణవో మమ వాచకః | వాచకత్వాన్మమైషో%పి వేదాదిరితి కథ్యతే || 20

ఓ అంబికా! నీవు అడిగిన ప్రశ్నలలో ముందుగా ఓంకారముయొక్క ఉద్ధారము (మంత్రరహస్యములను బయటకు తీయుట, అనగా విడివిడిగా తెలసుకొనుట) ను చెప్పెదను. దీనిని తెలియుట చేతనే పరమసిద్ధి (మోక్షము) లభించును (11). ముందుగా నివృత్తి (ఆపివేయుట)ని, తరువాత క్రమముగా ఇంధనమును, కాలమును, దండము (నియమము) ను మరియు ఈశ్వరుని ఉద్ధారము చేయవలెను (12). ఈ విధముగా మూడు మాత్రలు, బిందువు, నాదము అను అయిదు వర్ణములతో కూడియున్న స్వరూపము గల ప్రణవమును ఉద్ధారము చేసి నిత్యము జపించువారికి అది ముక్తిని ఇచ్చును (13). బ్రహ్మ మొదలుకొని గడ్డిపోచ వరకు గల సకలప్రాణుల ప్రాణము ఈ ఓంకారమే. కావుననే, దీనికి ప్రణవమను పేరు వచ్చినది (14). ఓంకారమునకు ఆకారము మొదటి వర్ణము; తరువాతిది ఉకారము; మధ్యమునందు మకారము గలదు; అది నాదముతో అంతమగును (15). ఓ మహర్షీ! ఓంకారమునందు మొదటి వర్ణము దక్షిణదిక్కునందు గలదు. అది జలస్వరూపము. మధ్యమవర్ణమగు మకారము ఉత్తరమునందు గలదు. అది అగ్ని స్వరూపము (16). క్రమముగా అకార, ఉకార, మకారములు మూడు మాత్రలు. తరువాతి భాగము సగము మాత్ర అని చెప్పబడినది (17) ఓ మహేశ్వరీ! బిందువు, నాదము కలిసి అర్ధమాత్ర యగును. జ్ఞానులచే మాత్రమే తెలియబడే ఈ అర్ధమాత్రను సాక్షాత్తుగా వర్ణించుట శక్యము కాదు (18). ఓ ప్రియురాలా! వేదములు నానుండియే పుట్టుననే సత్యమును 'ఈశానస్సర్వవిద్యానామ్' మొదలైన శ్రుతివాక్యములు చెప్పుచున్నవి (19). కావున, వేదమునకు ఆదిలోనుండే (కారణమైన) ఓంకారము నన్ను బోధించును. నన్ను బోధించుచుండుట చేతనే ఓంకారముకూడ వేదమునకు ఆది (కారణము) అని వర్ణించబడుచున్నది (20).

అకారస్తు మహద్బీజం రజస్స్రష్టా చతుర్ముఖః | ఉకారః ప్రకృతిర్యోనిస్సత్త్వం పాలయితా హరిః || 21

మకారః పురుషో బీజీ తమస్సంహారకో హరః | బిందుర్మహేశ్వరో దేవస్తిరో భావ ఉదాహృతః || 22

నాదస్సదాశివః ప్రోక్తస్సర్వానుగ్రహకారకః | నాదమూర్ధని సంచింత్యః పరాత్పరతరశ్శివః || 23

స సర్వజ్ఞస్సర్వకర్తా సర్వేశో నిర్మలో % వ్యయః | అనిర్దేశ్యః పరంబ్రహ్మ సాక్షాత్సదసతః పరః || 24

అకారాదిషు వర్ణేషు వ్యాపకం చోత్తరోత్తరమ్ | వ్యాప్యం త్వధస్తనంవర్ణమేవం సర్వత్ర భావయేత్ || 25

సద్యాదీశానపర్యంతాన్యకారాదిషు పంచసు | స్థితాని పంచ బ్రహ్మాణి తాని మన్మూర్తయః క్రమాత్ || 26

అష్టౌ కలాస్సమాఖ్యాతా అకారే సద్యజాశ్శివే | ఉకారే వామరూపిణ్యస్త్రయోదశ సమీరితాః || 27

అష్టావఘోరరూపిణ్యో మకారే సంస్థితాః కలాః | బిందౌ చతస్రస్సంభూతాః కలాః పురుషగోచరాః || 28

నాదే పంచ సమాఖ్యాతాః కలా ఈశాససంభవాః | షడ్విధైక్యానుసంధానాత్త్వ పంచాత్మకతోచ్యతే || 29

మంత్రో యంత్రం దేవతా చ ప్రపంచో గురురేవ చ | శిష్యశ్చ షట్ పదార్థానామేషామర్థం శృణు ప్రియే || 30

అకారము సర్వజగత్తునకు బీజమగు మహత్తత్త్వమునకు, రజోగుణమునకు, సృష్టికర్తయగు బ్రహ్మగారికి, ఉకారము మహత్తత్త్వమునకు కూడ కారణమగు మాయాశక్తికి, సత్త్వగుణమునకు, జగత్పరిపాలకుడగు విష్ణువునకు ప్రతీక (21). మకారము మాయాశక్తిసమేతుడగు ఈశ్వరునకు, తమోగుణమునకు, సంహారకుడగు రుద్రునకు ప్రతీక. బిందువు ప్రకాశస్వరూపుడగు మహేశ్వరునకు, తిరోభావము (కార్యజగత్తు కారణరూపములోనికి

విలీనము కాగా, ఆ కారణము కూడ పరమాత్మలో విలీనమగుట) నకు ప్రతీకయని చెప్పబడినది (22). సర్వము మరల అనుగ్రహించే సదాశివునకు నాదము ప్రతీకయని చెప్పబడినది.
సర్వజగత్కారణమగు ప్రకృతికంటె పరుడగు శివుని నాదముయొక్క అగ్రమునందు భావన చేయవలెను (23). ఆయనయే సర్వమును తెలిసినవాడు, సర్వమును సృష్టించువాడు, సర్వమును పాలించువాడు. శుద్ధుడు, నాశము లేనివాడు, శబ్దములచే సాక్షాత్తుగా నిర్దేశింప శక్యము కానివాడు, కార్యకారణములకు అతీతుడు అగు పరబ్రహ్మ సాక్షాత్తుగా ఆ సదాశివుడే (24). ఈ ప్రణవములోని ఆకారము మొదలగు వర్ణములలో తరువాతి వర్ణము దానికి ముందుండే వర్ణమును వ్యాపించును. అనగా, పూర్వవర్ణము వ్యాప్యము కాగా, ఉత్తరవర్ణము వ్యాపకమగును. ప్రణవమంతటా ఈ విధముగా భావన చేయవలెను (25). సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశానులు అనే నా స్వరూపములై యున్న ఐదు బ్రహ్మలు అకారము మొదలగు అయిదు వర్ణములయందు క్రమముగా ప్రతిష్ఠితులై యున్నారు (26). ఓ పార్వతీ! ఆకారమునందు సద్యోజాతుని నుండి పుట్టిన ఎనిమిది కళలు, ఉకారమునందు వామదేవస్వరూపములగు పదమూడు కళలు గలవని చెప్పబడినది (27). మకారమునందు అఘోరస్వరూపములగు ఎనిమిది కళలు గలవు. బిందువునందు తత్పురుషస్వరూపములగు నాలుగు కళలు ఉద్భవించి యున్నవి (28). నాదమునందు ఈశానునినుండి పుట్టిన అయిదు కళలు గలవు. ఆరు విధముల ఐక్యమును అనుసంధానము (భావన) చేయుటచే ప్రణవము ప్రపంచమునకు ఆత్మయగునని చెప్పబడినది (29). మంత్రము, యంత్రము, దేవత, ప్రపంచము, గురువు, శిష్యుడు అనునవి ఆ ఆరు తత్త్వములు. ఓ ప్రియురాలా! ఈ ఆరు పదార్థముల తత్త్వమును గురించి వినుము (30).

పంచవర్ణసమష్టిస్స్యాన్మంత్రః పూర్వముదాహృతః | స ఏవ యంత్రతాం ప్రాప్తో వక్ష్యే తన్మండలక్రమమ్ || 31

యంత్రం తు దేవతారూపం దేవతా విశ్వరూపిణీ | విశ్వరూపో గురుః ప్రోక్తశ్శిష్యో గురువపుఃస్మృతః || 32

ఓమితీదం సర్వమితి సర్వం బ్రహ్మేతి చ శ్రుతేః | వాచ్యవాచకసంబంధో % వ్యయమేవార్థ ఈరితః || 33

ఆధారో మణిపూరశ్చ హృదయం తు తతః పరమ్ | విశుద్ధిరాజ్ఞా చ తతశ్శక్తిశ్శాంతిరితి క్రమాత్ || 34

స్థానాన్యేతాని దేవేశి శాంత్యతీతం పరాత్పరమ్ | అధికారీ భ##వేద్యస్య వైరాగ్యం జాయతే దృఢమ్ || 35

విషయస్సార్వ్యమహం దేవి జీవబ్రహ్మైక్యభావనాత్ | సంబంధం శృణు దేవేశి విషయస్సమ్యగీరితః || 36

జీవాత్మనోర్మయా సార్ధమైక్యస్య ప్రణవస్య చ | వాచ్యవాచకభావో%త్ర సంబంధస్సముదీరితః || 37

వ్రతాదినిరతశ్శాంతస్తపస్వీ విజితేంద్రియః | శౌచాచారసమాయుక్తో భూదేవో వేదనిష్ఠితః || 38

విషయేషు విరక్తస్సన్నైహికాముష్మికేషు చ | దేవానాం బ్రహ్మణ %పీహ లోకజేషు శివవ్రతీ || 39

సర్వశాస్త్రార్థతత్త్వజ్ఞం వేదాంతజ్ఞానపారగమ్ | ఆచార్యముపసంగమ్య యతిం మతిమతాం వరమ్ || 40

దీర్ఘదండప్రణామాద్యైస్తోషయేద్యత్నతస్సుధీః | శాంతాదిగుణసంయుక్తశ్శిష్యస్సౌశీల్యవాన్ వరః || 41

ఈ అయిదు వర్ణముల కలయికయే మంత్రమగునని పూర్వములో చెప్పియుంటిని. ఆ మంత్రమే యంత్రరూపమును దాల్చును. దాని మండలముల క్రమమును చెప్పెదను (31). యంత్రము దేవతయొక్క స్వరూపము. దేవత జగత్స్వరూపిణి. గురువు

జగత్స్వరూపుడని చెప్పబడినది. శిష్యుడు గురువుయొక్క శరీరమని ఋషులు చెప్పుచున్నారు (32). ఈ సర్వము ఓంకారమే అనియు, సర్వము బ్రహ్మమేననియు వేదము చెప్పుచున్నది. కావున, ఓంకారము వాచకము, బ్రహ్మ వాచ్యము అనే సంబంధము కూడ ఇదే విషయమును చెప్పుచున్నది (33). దేవతలకు ప్రభ్వియగు ఓ పార్వతీ! ఆధారము, మణిపూరము, హృదయము, విశుద్ధి, ఆజ్ఞ, శక్తి, శాంతి అనునవి క్రమముగా ఒకదానిపై మరియొకటి ఉండును. ఇవి స్థానములని చెప్పబడినవి. శాంతికి పైన పరాత్పరుడగు సదాశివుడు ఉండును. ఎవనికి దృఢమగు వైరాగ్యము కలుగునో, వాడే అధికారి (34, 35). జీవబ్రహ్మల ఏకత్వము భావన చేయబడును. కావున, ధ్యానమునకు విషయము నేనే అగుచున్నాను. దేవతలకు ప్రభ్వియగు ఓ పార్వతీ! విషయమును చక్కగా చెప్పియుంటిని. ఇపుడు సంబంధమును వినుము (36). జీవుడు, ఆత్మ అనువాటికి నాతో అభేదము వాచ్యము. ఓంకారము వాచకము. ఈ సందర్భములో ఇదియే సంబంధమని చెప్పబడినది (37). వ్రతము మొదలగు వాటియందు చాల ప్రీతి గలవాడు, శాంతస్వభావము గలవాడు, తపశ్శాలి, ఇంద్రియములను జయించినవాడు, శుచిశుభ్రతలు గలవాడు. సచ్ఛీలము గలవాడు, బ్రాహ్మణుడు, వేదమునందు నిష్ఠ గలవాడు (38). ఇహలోకమునందలి భోగములయందు మాత్రమే గాక పరలోకములో దేవతల భోగములయందు కూడ వైరాగ్యము గలవాడు, శివదీక్ష గలవాడు, మంచి బుద్ధి గలవాడు, శమదమాదిగుణసంపన్నుడు, సౌశీల్యము గలవాడు అగు శిష్యశ్రేష్ఠుడు సకలశాస్త్రముల సారమునెరింగినవాడు, వేదాంతజ్ఞానమునందు నిష్ణాతుడు, బుద్ధిమంతులలో శ్రేష్ఠుడు, సన్న్యాసి అగు ఆచార్యుని వద్దకు వెళ్లి, సాష్టాంగనమస్కారము మొదలగు వాటిచే ప్రయత్నపూర్వకముగా ఆయనను సంతోష పెట్టవలెను (39-41).

యో గురుస్స శివః ప్రోక్తో యశ్శివస్స గురుస్స్మృతః | ఇతి నిశ్చిత్య మనసా స్వవిచారం నివేదయేత్ || 42

లబ్ధానుజ్ఞస్తు గురుణా ద్వాదశాహం పయోవ్రతీ | సముద్రతీరే నద్యాం చ పర్వతే వా శివాలయే || 43

శుక్లపక్షే తు పంచమ్యామేకాదశ్యాం తథాపి వా | ప్రాతస్స్నాత్వాతు శుద్ధాత్మా కృతనిత్యక్రియస్సుధీః || 44

గురుమాహూయ విధినా నాందీశ్రాద్ధం విధాయ చ | క్షౌరం చ కారయిత్వా%థ కక్షోపస్థవివర్జితమ్ || 45

కేశశ్మశ్రునఖానాం వై స్నాత్వా నియతమానసః | సక్తుం ప్రాశ్యాథ సాయహ్నే స్నాత్వా సంధ్యాముపాస్య చ || 46

సాయమౌపాసనం కృత్వా గురుణా సహితో ద్విజః | శాస్త్రోక్తదక్షిణాం దత్త్వా శివాయ గురురూపిణ || 47

హోమద్రవ్యాణి సంపాద్య స్వసూత్రోక్తవిధానతః | అగ్నిమాధాయ విధివల్లౌకికాదివిభేదతః || 48

అహితాగ్నిస్తు యః కుర్యాత్ప్రాజాపత్యేష్టినాహితే | శ్రౌతే వైశ్వానరే సమ్యక్ సర్వవేద సదక్షిణమ్ || 49

అథాగ్నిమాత్మన్యారోప్య బ్రాహ్మణః ప్రవ్రజేద్గృహాత్ | శ్రపయిత్వా చరుం తస్మిన్సమిదన్నాజ్యభేదతః || 50

పౌరుషేణైవ సూక్తేన హుత్వా ప్రత్యృచమాత్మవాన్ | హుత్వా చ సౌవిష్టకృతీం స్వసూత్రోక్తవిధానతః || 51

ఎవడు గురవో, వాడే శివుడు, ఎవరు శివుడో, వాడే గురువు అని మహర్షులు చెప్పిరి. ఈ విషయమును మనస్సులో నిశ్చయించుకొని తన మనస్సులోని భావమును గురువునకు నివేదించవలెను (42). సద్బుద్ధి గల బ్రాహ్మణుడగు సాధకుడు గురువుయొక్క అనుజ్ఞను పొంది పన్నెండు రోజులు పాలను మాత్రమే ఆహారముగా తీసుకొని, సముద్రతీరమునందు గాని, నదీతీరమునందు గాని, పర్వతమునందు గాని, శివాలయమునందు గాని, శుక్లపక్ష

పంచమినాడు గాని, ఏకాదశి నాడు గాని, ఉదయమే స్నానమును చేసి పవిత్రమగు అంతఃకరణము గలవాడై నిత్యకర్మలను ఆచరించి, గురువును ఆహ్వానించి యథావిధిగా నాందీశ్రాద్ధమును చేసి, క్షౌరకర్మయందు కక్షములను గుహ్యమును విడిచిపెట్టి శిరోజములను గెడ్డమును మీసమును గోళ్లను తీసివేసి, తరువాత స్నానమును చేసి, ఏకాగ్రమగు మనస్సు గలవాడై, పిండిని భుజించి, తరువాత సాయంకాలమునందు స్నానమును చేసి సంధ్యావందనమును చేసి, గురువుతో కూడి సాయంకాల - ఔపాసనమును చేసి, గురువు రూపములోనున్న శివునకు శాస్త్రోక్తమగు దక్షిణను ఇచ్చి (43-47), హోమద్రవ్యములను సంపాదించి, స్వశాఖాసూత్రములో చెప్పిన విధముగా యథావిధిగా లౌకికాగ్ని మొదలగు విభేదములను అనుసరించి అగ్నిని ప్రతిష్ఠించవలెను (48). అహితాగ్నియగు బ్రాహ్మణుడు ప్రాజాపత్యేష్టిచే ఆధానము చేయబడిన శ్రౌతాగ్నియందు చక్కగా ఆహుతులను సమర్పించి సమస్తసంపదను దక్షిణగా ఇచ్చి, తరువాత ఆ అగ్నిని తన యందు ఆరోపించుకొని, ఇంటిని విడిచి సన్న్యసించవలెను. తరువాత, అతడు స్థిరచిత్తముగల వాడై చరువు (హోమద్రవ్యము) ను వండి ఆ అగ్నియందు సమిధలు, అన్నము, నెయ్యి మొదలగు వివిధద్రవ్యములను (49,50), పురుషసూక్తమును పఠిస్తూ ప్రతి ఋక్కునకు అంతమునందు హోమము చేసి స్వశాఖాసూత్రములో చెప్పబడిన విధముగా స్విష్టకృత్ హోమమును చేయవలెను (51).

హుత్వోపరిష్టాత్తంత్రం చ తేనాగ్నేరుత్తరే బుధః |

స్థిత్వాసనే జపేన్మౌనీ చైలాజినకుశోత్తరే | యావద్బ్రాహ్మముహూర్తం తు గాయత్రీం దృఢమానసః || 52

తతస్స్నాత్వా యథాపూర్వం శ్రపయిత్వా చరుం తతః | పౌరుషం సూక్తమారభ్య విరజాంతం హువేద్బుధః || 53

వామదేవమతేనాపి శౌనకాదిమతేన వా | తత్ర ముఖ్యం వామదేవ్యం గర్భయుక్తో యతో మునిః || 54

హోమశేషం సమాప్యాథ ప్రాతరౌపాసనం హువేత్ |
తతోఽగ్నిమాత్మన్యారోప్య ప్రాతస్సంధ్యాముపాస్య చ || 55

సవితర్యుదితే పశ్చాత్సావిత్రీం ప్రావిశేత్క్ర మాత్ | ఏషణానాం త్రయం త్యక్త్వా ప్రేషముచ్చార్య చ క్రమాత్ || 56

శిఖోపవీతే సంత్యజ్య కటిసూత్రాదికం తతః | విసృజ్య ప్రాఙ్ముఖో గచ్ఛేదుత్తరాశాముఖోఽపి వా || 57

గృహ్ణీయాద్దండకౌపీనాద్యుచితం లోకవర్తనే | విరక్తశ్చేన్న గృహ్ణీయాల్లోకవృత్తివిచారణ || 58

గురోస్సమీపం గత్వాఽథ దండవత్ప్రణమేత్త్రయమ్ | సముత్థాయ తతస్తి ష్ఠేద్గురుపాదసమీపతః || 59

తతో గురుస్సమాదాయ విరజానలజం సితమ్ | భస్మ తేనైవ తం శిష్యం సముద్ధూల్య యథావిధి || 60

తరువాత ఆ విద్వాంసుడు తంత్రోక్తవిధానముగా కూడ హోమమును చేసి, అగ్నికి ఉత్తర దిక్కునందు వస్త్రము, మృగచర్మము మరియు దర్భలతో రచింపబడిన ఆసనమునందు కూర్చుండి దృఢమగు చిత్తము గలవాడై బ్రాహ్మముహూర్తము వరకు గాయత్రిని జపించవలెను (52). తరువాత ఆ విద్వాంసుడు స్నానమును చేసి యథావిధిగా హోమము కొరకై అన్నమును వండి పురుషసూక్తముతో మొదలిడి విరజాసూక్తము వరకు హోమమును చేయవలెను (53). ఈ ప్రక్రియను వామదేవమహర్షి చెప్పిన విధముగా గాని, శౌనకాది మునులు చెప్పిన విధముగా గాని చేయవచ్చును. కాని వామదేవమహర్షి తల్లి గర్భమునందుండగనే జ్ఞాని యైనాడు గాన, ఆయన చెప్పిన పద్ధతి శ్రేష్ఠము (54). తరువాత శేషహోమమును పూర్తి చేసి, ప్రాతరౌపాసనమును చేయవలెను. తరువాత అగ్నిని తనయందు ఆరోపించుకొని, ప్రాతస్సంధ్యావందనమును చేసి (55), సూర్యోదయమైన తరువాత గాయత్రీమంత్రమును జపించవలెను.

తరువాత క్రమముగా మూడు ఏషణలను (సంతానము, ధనము, పరలోకములయందు గల ఆసక్తి) విడిచి పెట్టి ప్రేష (సన్న్యసించే సమయములో చెప్పే) మంత్రములను ఉచ్చరించి (56). పిలక, యజ్ఞపవీతము, మొలత్రాడు మొదలగు వాటిని పరిత్యజించి, తూర్పు దిక్కు వైపునకు గాని, ఉత్తరము వైపునకు గాని వెళ్లవలెను (57). తరువాత లోకములో సంచరించుటకు తగిన దండమును, కౌపీనమును స్వీకరించవలెను. అతడు లోకవ్యవహారమునందు, లోకసంచారమునందు ఇష్టము లేని వాడైనచో, వాటిని స్వీకరించనక్కర లేదు (58). తరువాత అతడు గురువు వద్దకు వెళ్లి మూడు సార్లు సాష్టాంగ నమస్కారమును చేయవలెను. తరువాత గురువునకు సమీపములో నిలబడవలెను (59). అపుడు గురువు విరజాహోమము చేయగా మిగిలి యున్న తెల్లని భస్మను తీసుకొని, దానిని శిష్యునికి యథావిధిగా పూయవలెను (60).

అగ్నిరిత్యాదిభిర్మంత్రై స్త్రిపుండ్రం ధారయేత్తతః | హృత్పంకజే సమాసీనం మాం త్వయా సహ చింతయేత్ || 61

హస్తం నిధాయ శిరసి శిష్యస్య ప్రీతమానసః | ఋష్యాదిసహితం తస్య దక్షకర్ణే సముచ్చరేత్ || 62

ప్రణవం త్రిప్రకారం తు తతస్తస్యార్థమాదిశేత్ | షడ్విధార్థం పరిజ్ఞానసహితం గురుసత్తమః || 63

ద్విషట్ ప్రకారం స గురుం ప్రణమ్య భువి దండవత్ | తదధీనో భ##వేన్నిత్యం వేదాంతం సమ్యగభ్యసేత్ || 64

మామేవ చింతయేన్నిత్యం పరమాత్మానమాత్మని | విశుద్ధే నిర్వికారే వై బ్రహ్మ సాక్షిణమవ్యయమ్ || 65

శమాదిధర్మనిరతో వేదాంతజ్ఞానపారగః | అత్రాధికారీ స ప్రోక్తో యతిర్విగతమత్సరః || 66

హృత్పుండరీకం విరజం విశోకం విశదం పరమ్ | అష్టపత్రం
కేసరాఢ్యం కర్ణికోపరి శోభితమ్ || 67

ఆధారశక్తిమారభ్య త్రితత్త్వాంతమయం పదమ్ | విచింత్య
మధ్యతస్తస్య దహరం వ్యోమ భావయేత్ || 68

ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మాం త్వయా సహ |
చింతయేన్మధ్యతస్తస్య నిత్యముద్యుక్తమానసః || 69

ఏవం విధోపాసకస్య మల్లోకగతిమేవ చ | మత్తో విజ్ఞానమాసాద్య
మత్సాయుజ్యఫలం లభేత్ || 70

ఇతి శ్రీ శివమహాపురాణ కైలాససంహితాయాం
సన్న్యాసపద్ధతివర్ణనం నామ తృతీయో%ధ్యాయః (3).

తరువాత 'అగ్నిరితి' అని మొదలయ్యే మంత్రముతో త్రిపుండ్రమును ధరింపజేయవలెను. హృదయపద్మమునందు నీతో గూడి ప్రతిష్ఠితుడనై యున్న నన్ను ధ్యానించవలెను (61). ప్రీతితో నిండిన మనస్సు గల గురువు శిష్యుని శిరస్సుపై చేతిని ఉంచి వాని కుడి చెవిలో ఋషి మొదలగు వాటితో కూడియున్న ప్రణవమంత్రమును మూడు సార్లు చక్కగా ఉచ్చరించవలెను. ఆ గురుశ్రేష్ఠుడు తరువాత ఉపాసనా (స్వానుభవ) సహితముగా దాని ఆరు విధముల అర్థమును బోధించవలెను (62, 63). ఆ శిష్యుడు గురువునకు పన్నెండు సార్లు భూమిపై సాష్టాంగముగా ప్రణమిల్లి నిత్యము గురువునకు వశుడై యుండి, వేదాంతమును చక్కగా అభ్యసించవలెను (64). ఆతడు నిత్యము పరిశుద్ధమైన, వికారములు లేని మనస్సులో సాక్షిస్వరూపుడను, వినాశము లేనివాడను, పరంబ్రహ్మను, పరమాత్మను అగు నన్ను మాత్రమే ధ్యానించవలెను (65). శమదమాదిధర్మములయందు నిత్యము ప్రీతి గలవాడు, వేదాంతజ్ఞానమునందు నిష్ణాతుడు, మాత్సర్యము లేనివాడు అగు ఆ యతి ఈధ్యానమునందు అధికారము గలవాడని చెప్పబడినది (66). దోషములు లేనిది, శోకము లేనిది, శ్రేష్ఠమైనది, ఎనిమిది పత్రములు

గలది, కేసరములతో శోభిల్లునది, తొడిమకు పై భాగమునందు విరాజిల్లునది, మూలాధారశక్తితో మొదలిడి మూడు తత్త్వములకు పైన ఉండునది అగు హృదయపద్మమనే ఈశ్వరధామమును భావన చేసి దానిమధ్యలో దహరాకాశము (ఈశ్వరస్థానము) ను భావన చేయవలెను (67, 68). పరబ్రహ్మస్వరూపమైన ఓం అనే ఏకాక్షరమంత్రమును ఉచ్చరిస్తూ నీతో గూడియున్న నన్ను ఆ హృదయాకాశమధ్యములో నిత్యము స్థిరమగు మనస్సుతో ధ్యానించవలెను (69). ఓ ప్రియురాలా! ఈ విధముగా ఉపాసించు సాధకుడు నా లోకమును పొంది నానుండి విజ్ఞానమును పొంది నా సాయుజ్యము అనే ఫలమును పొందును (70).

శ్రీశివమహాపురాణములోని కైలాససంహితయందు సన్న్యాసపద్ధతి వర్ణనము అనే మూడవ అధ్యాయము ముగిసినది (3).